ఓం

# అతీతానుభవతత్వనీతి.

సర్వ్వముగల ఈ గ్రంథము

బ్రహ్మశ్రీ బేతపూడి పరబ్రహ్మకవిగారి పుత్రుండగు

కృష్ణానందాచలబ్రహ్మపూర్ణులచే

స్థిగసాగముగ రచియింపబడియె

500 ప్రతులు.

బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు

బి. కే. స్వామిచే ముద్రింపబడియె.




కాపీరైట్. 1917. వెల రు 0—1—0.



# అతీతానుభవ తత్వనీతి

## తత్వములు

(కుటిలము)



బేహాగురాగం - ఏకతాళం - "రారపోదము" మాదిరి.

సంసారసాగరం । సర్వ । సాగరంబులతుర్యం । హింసించిసాధుల । వంచించునట్టి ॥ సం ॥ బేతపూడికృష్ణును । భ్రమపెట్టుచుండును । సాధించియెటులైన । శోధనజేయ ॥ సం ॥

(చిత్రము)

2 బారువరాగం - ఆటతాళం - "తేరెనామమహమ్మదు" మాదిరి.

మాయప్రపంచం । మదిరోచసౌఖ్యం । బాయనతిసుఖం । జే
యనశక్యం॥ మా॥ తనువులుకల్ల । తోడపులుకల్ల । ప్రాణులుకల్ల । మ
నములుకల్ల॥ మా॥ కాలకర్మములు । కులగోత్రములు । ఆలుబిడ్డలు ।
ఎల్లభోగములు॥ మా॥ ఓటిసంసారం । ఒసగునిస్సారం । కంటెవిచారం
కరిసకోతారం॥ మా॥ ధరణిలోబుట్టి । ధరరుచులబట్టి । ధరణిబాతిపెట్టి।
ధరణిదిరిగిపుట్టి॥ మా॥ నిత్యానందబ్రహ్మ । నైపుణ్యుడన్న । సత్యస్వ
భావుడన్న । ఐక్యంబునీయుమన్న॥ మా॥

( గే లి )

3 జంఝూటిరాగం - ఆదితాళం - "అన్నలారలేలెండి" మాదిరి.

నేనెంత తెల్పుదు నీజగము । నేయంతు తేలని యీజగము । నా



ద్యంతము లేని యీజగము । మధ్యవతరించిన యీజగము । సౌమ్య
ములసంఘము ఈజగము । అన్యోన్యపాశము ఈజగము । శూన్యంబు
మోహము ఈజగము । విద్యాములమూలము ఈజగము । కృష్ణానంద
ము ఈజగము । జ్ఞానంబుగజూపెను యీజగము । నామెనుచాలుర
ఈజగము । హాయిగవత్తును నీపరము॥ నే॥

( జన్మత్యాగము )

4 భైరవిరాగం - అటతాళం - 'నాయనా నందివాహనా' మాదిరి.

వద్దుర జన్మవద్దుర । వ్యర్థముగధరలో । ఎద్దినమునైన॥ వ॥ నీస్థి
తిలో నీవాగలేక । నస్థిరంబగుసృష్టిజూపి । మొద్దుతనువునొసగినన్ను ।
బద్ధునిగ నాడించనేటికి॥ వ॥ రక్తమాంసములతోడనిండిన । రోతయా
యీయస్థిపేటిక । నెత్తిశ్రమలబెట్టనేల । నుత్తదిచేపట్టిబ్రోవుము॥ వ॥
ఇచటబుట్టుటవల్లనాకొక । నిత్యమైనదికానరాదు । ఎంచజన్మంబెత్తలా

భవము । పక్షినైతిరుగంగవలసె॥ వ॥ తెలసెదెలసె నీకులోకము । దిగి తెదుఃఖముకంటెమోసము । సరగునానాకర్మబాపి । సిరతసుఖదానంద మొసగుము॥ వ॥ తల్లిదండ్రులు బంధుహితులు । తథ్యమనిమదినమ్మకుంటె । ఇలలోనెప్పుడో ఎట్టివేళనో । కలలోనీలగగూలిపోదురు॥ వ॥ చేతపూడి కృష్ణనంద । బ్రహ్మాచలతీతపూర్ణున । సంతతమునిను బాయకుండగ । భక్తిశ్రద్ధలజాలనొసగుము॥ వ॥

(భ్రాంతిరహితము)

5 నాదనామక్రియరాగం - ఏకతాళ.

'పొద్దుజీవమ పొద్దుచాలకపోయె' మాదిరి.

నమ్మకునమ్మకునమ్మకుమనస । నమ్మినమో సంబోనుసుమీ । నమ్మినసీభ్రమయెల్ల । నిర్మూలంబగునన్నన్న॥ న॥ ఇప్పుడుకాంచిన ఇహాము ఇప్పుడు । ఎట్లుగనుండునొ ఓమనస । ఎప్పుడునివతీ భ్రాంతిగ



నిట । నుబ్బెదవేలనె అయ్యయ్యో॥ న॥ తృణముమొదలు త్రిమూర్తులు సర్వము । దెలియగశూన్యమె ఓమనస । ఎన్నిబాములు కల్గినగాని । నన్నుమరువకె యోసోసి॥ న॥ అతడెఅనంతుడు అచ్యుతుడవ్యయు। డాద్యంతరహితుడె యోమనస । అతనియతీతము నంటినదానికి । కొదువేమున్నదె యహహా॥ న॥ చేతపూడికృష్ణానందచల । బ్రహ్మపూర్ణుడె యోమనస । ప్రతిదినమును వ్యర్థముబుచ్చక । నెదనాత్ముని దలచవె వహ్వావ్వా॥ న॥

(విజ్ఞానవిజృంభనము)

6 బిళహరిరాగం - అటతాళము.

కొహింగలియోమొగయోష — మాదిరి.

మనోకాంతగూడర । మోక్షపుత్రుగానర । ఇయ్యవనమాయ వనితజేరి । అజ్ఞానశిశువుగనకుర॥ మ॥ వివేకకొమరుగన్నవారు । విశ్వ

మయులైయుండెరా । అవిద్యబుద్ధులగొన్నవారు । అవనిలోనున్నారురా॥ హంసోహభావంబనెడియహము । నోర్పుతో జల్లార్చరా । హంసచేసోహంబుబూని । యచంచలస్థితి జేర్చరా॥ మ॥ ఖ్యాతిగనరుడవెసందుకు । జ్యోతి తేజునిజూడరా । ఈశ్వరాశివెతుకనినరునికిలలో । జెందుమృత్యుపాలురా॥ మ॥ ఎన్ని శాస్త్రములెన్ని ధర్మము । లెన్ని జదివిన నేమిరా । మనమునమనసంబుసల్పుచు । జ్ఞానమున గమనించరా ॥ మ ॥ పొట్టపాటులెన్ని యున్న । బట్టుపట్టిపోరరా । లోటులన్ని దీరునంతలో । గాటికేతయారురా॥ మ॥ కర్మయనుమొకకొండచాటున । మర్మగురువులుకలరురా । అమ్మేరువులంఘికులె । జన్మరహితులుగ భావించరా॥ మ॥ బేతపూడికృష్ణనంద । పూర్ణుడై బ్రాహ్మణుడురా । ఆదినునియాకొండదాటు । మతిలో వేగమెయుంచరా॥ మ॥

9

(పరమాత్మ దర్శనము)

7 శంకరాభరణరాగం - ఆదితాళం - 'సదానిసమ్మగసద' మాదిరి.

ఆత్మపదార్థంబొక్కటిరా । అదిసర్వమయంబై యున్నదిరా । ఇమ్మహినిభక్తచిత్తంబులోపల । మమతతాండవమాడునురా॥ ఆ॥ నామరూపములు లేనిదిరా। నాల్కకుఅమృత పాకమురా । ఊబికినదలచిన గన్ననువిన్నను । బ్రహ్మానందము  చునురా॥ ఆ॥ మంచిచెడుగులు కానిదిరా। ఋంచినోస్తున్నై యున్నదిరా । వచింపరానియఖండకాంతితో । నక్షీణంబై వెల్గునురా ॥ ఆ॥ పురుషుస్త్రీయును కానిదిరా । పరిపూర్ణదివ్యమై యున్నదిరా । సారమైనకాపారనుంగున । చంద్రశేఖుడలె నెరయునురా॥ ఆ॥ జననమరణములు లేనిదిరా । జీవాంశపోలికలుకానిదిరా । మాయాతీతుని యనుభవమునగున । అనామధేయము బాల్చునురా॥ ఆ॥ ముఖ్యరుమూర్తులు గానిదిరా । మూలవిరాట్టైయున్నదిరా । గర్వముచే దల్ద్రి

ప్పెడువానిని । గవ్వకుగొరగాకుంచునుర॥ ఆ॥ లజ్జభయములు లేనిదిర । లాభలోభములు లేనిదిర । నీచగుణముల నిగ్గెడుజీవిని। యీడ్చునుయూరి బయటకుర॥ ఆ॥ మాయదగ్ధుడైయుండెడుయాత్మని । మానముగదరి జేర్చునుర । మాయబద్ధుడైయుండెడుప్రాణిని । మాయబొందలో గ్రుక్కునుర॥ ఆ॥ చేతపూడికృష్ణానందచల । బ్రహ్మపూర్ణ డెట్లనెవినర । అతీతవాక్యము నమృతపాకము । ఖీతింజేసిరుచిగనవలెర॥ ఆ॥

( భ్రాంతినిర్భ్రాంతులపోరాటము )

8 నాధనామక్రియరాగం ఏకతాళము - 'నారాయణ'యనుమాదిరి.

భ్రాంతి— మాయపిల్ల పెండ్లియాడర । మహామధురతంత్రి । మోహంపురాని । మాయకన్య పెండ్లియాడి । మాయపదవిబొందినీవు । మా
మాయగమాయనుకడపి । మాయమైననుచేరవచ్చు ॥ మా ॥

నిర్భ్రాంతి— మాయలాడి పెండ్లియాడనె । మాయమ్మతల్లి । కయ్యా



లనల్లి । మాయకూన పెండ్లియాడి । మాయలో బడిమడియుకంటె । నిన్ను దానిమంట బెట్టి । నేను నేనై యుండుగాని ॥ మా ॥

భ్రాంతి— నేనుపోతెనీకుయెట్లుర । నానాయనయ్యా । ననుకన్నయ్యా । నేనుపోతెనీకుయెట్లు । చనిననీవునాకుయెట్లు । న్యాయమా ననుబాయుటెట్లు । శూన్యుడవై ననుకానవ ॥ మా ॥

నిర్భ్రాంతి— చాలుచాలువగలుయేడ్పులు । మరుపులమారి । చిత్రలకోతి । కాలుకదలు లేకున్నను । కాలిపోనున్న వంశము । కాలుదీసియావలబెట్టు । కాళ్ళగజ్జగంగానమ్మ ॥ మా ॥

భ్రాంతి— సున్నజుట్టిపోయెదవుర । సన్నాసిజీవ । చోద్యాలదొంగ । నన్ను సున్న జేసువరకు । నిన్ను సున్నంసల్పి నేను । మాయాయనుత్తోయధిలోన । నైక్యపరచినాస్తియాదు ॥ మా ॥

నిర్భ్రాంతి— నానామమునీవువింటివ । ఓయింతిభ్రాంతి । ఓమాయ

చేవి। కననేనిర్భ్రాంతుడను । గొనభ్రాంతిభ్రమరాంబవు। నీనాపొం
దునికను । వహ్నిపచ్చికజెందువిధము ॥ మా ॥

భ్రాంతి— నిన్నుయంటనిన్నుయంటర । నాహానిజ్యోతి। ఓహీనజాతి।
అనుటకునాల్కరాదు । వినుటకుచెవినిపడదు । కనుటకుచూపు
లేదు । చనుటకుశక్తిరాదు ॥ మా ॥

నిర్భ్రాంతి— శబ్దస్పర్శలేకపోయెనె । ఛీదారుదొంగ । శోభనకొంగ
శబ్దబ్రహ్మములేచిమొగచి । శుద్ధబ్రహ్మమునందునిచ్చె । అందునిందు
నెందునొంచిన । నశ్వరతత్వంబై వెలసిల్లెను ॥ మా

(అదృశ్యదృశ్యులహంసధ్వనులయుద్ధము)

9 బ్యాగుస్వరము - ఏకతాళము - 'దేవబ్రోవరా' మాదిరి

అదృ— లేనే లేనురా । లేదనువానికి । ఇహపరములనొందు ॥ లే ॥
దృశ్య— ఉండేయుండెర। ఉన్నదనుప్రాశికి। నిండుపున్నమబోలి ॥ఉం॥



అదృ— వట్టితల్కురా । వట్టుబెట్టినట్టు । మట్టిపాలైపోను ॥ లే ॥
దృశ్య— ఏటిభ్రాంతిర । ఎందుకుజెందక । దాటుబొందిపైని ॥ ఉం ॥
అదృ— గ్రుడ్డిభ్రాంతిర । గుర్తుదెలియకను । గ్రుడ్డుచుట్టుచుంద్రు ॥ లే ॥
దృశ్య— ఏది కీలుర । ఏదో తెల్పియుపుడు । సిద్ధినినుసువేగ ॥ ఉం ॥
అదృ— అదెగుతుఁరా । అందలిగుతెగెగి । పెద్దపుకమ్మిక ॥ లే ॥
దృశ్య— ఎవ్వడాగురుడు । ఎన్నతరముకాని । హృత్పద్మస్ఖలితు
డు ॥ ఉం ॥

అదృ— ఆత్మస్వరూపుడు । అచలబ్రహ్మానంద । ఉన్మత్తచిత్తుడు ॥ లే ॥
దృశ్య— ఏమిపుణ్యుడు। ఎన్నికగైకొన్న । జన్మరాహిత్యుడు ॥ ఉం ॥
అదృ— ఏమనుకొంటివి । ఏమాయమెరుగని । యమాయకుడు
వాడు ॥ లే ॥

దృశ్య— తృప్తిజెందెను । తృటిలోననామనపు । పొత్తునువద

లించె ॥ ఉం ॥

అద్భ— ఈడేరెను। జీవాత్మయైక్యపు। నాడుఫలమిప్పుడు ॥ లే ॥

(జన్మజిజ్ఞాస)

10 బ్యాంకుస్వరము - ఏకతాళము - 'జరామరణరహిత' మాదిరి
ఇహజన్మమేహ్యాముర । ఇకనిదిదోమకైనవద్దుర । ఎయ్యేడజూడ రూపంబుర । ఏన్నెన్నోనామంబులనాకుర ॥ ఇ ॥ భయలజ్జప్రతిమయిది । పుడమిమెరసెడిమెరుపుయిది । మాయలమూటయిది । బాయక మర్దించుమారియిది ॥ ఇ ॥ మలమూత్రముప్పిల్లుర । మట్టుబెట్టితెమల్టానుర । ఝురితరంగములట్లుర । దరిదూరమొచ్చుచుబోచుండుర ॥ఇ॥ తరగనితనువులెల్ల । దాల్చునుదొంగలదొమ్మివలె । తర్లునువిధితప్పక । మళ్ళునుభువిబుట్టగ ॥ ఇ ॥ కనలేనుకనకంబును । కనుగొనుకొండంత కట్టెలను । అహమనుయముచేతను । ఇహమునజిక్కునుపాశంబున ॥ఇ॥



అచలబ్రహ్మానందము । ఎవ్వనికందనియతిమధురము । చంచలమాకాశము । ఆశించుటసుమముసమము ॥ ఇ ॥

(దివ్యజ్ఞానఖండనము)

11 కన్నడరాగము - ఆదితాళము - 'ఆనందమయ్యేరా' మాదిరి.
ఎన్నినాకగున । ఎంచలేనిజీవజన్మనైజము ॥ ఎ ॥ అహంకారులై హుంకరించుచు । మహామహాత్ములబరిహాసించుచు । సోహహంసల హింసించుచు । నిహపరములముక్తొందనినుఖులౌల ॥ ఎ ॥ కృష్ణ నందునిగుణంబెరింగి । క్రూరకార్యములెల్లదొలంగి । లక్ష్యనమ్మకము లేకమాని । సర్వ్యాపకత్వమెదనాటనిమత్తుల ॥ ఎ ॥

(తత్వధ్యానము)

12 బారువరాగము - ఆదితాళము - 'గిరిజాతనయ' మాదిరి.
ఓఅచలాశిల । ఓపికబూనర । తనయుడనగునను । దయతోగా

వర ।॥ ఓ ॥ జననంబాదిగ । జననమరణముచె । బునర్జన్మలకు । జను చుంటిర ॥ ఓ ॥ తెలిసి తెలియక జేసినతప్పులు । తేలకతిప్పలుపడుచుం టిర । వెఱ్రివదలక మరిమరికోరుచు । నెళ్ళునిల్వక గుళ్ళుచుంటిర ॥ ఓ ॥ నీలోకములునీచిత్రములు । నీచరిత్రలుగ గంటిర । పరుగునచల బ్రహ్మపూర్ణు । ద్వరదరిజేరితరింతుర ॥ ఓ ॥

(జన్మరాహిత్యము)

13 శంకరాభరణరాగము - ఆదితాళము - 'పాపహరాణ' మాదిరి

ఊపిరిలి త్తిదిర । ఉఫ్ ఉఫ్ అన నుబ్బునుర । సర్పంబుతీరు బుస్ బుస్సుఅనుచు । గుబుసంబు విడచునుర ॥ ఊ ॥ ఏమాత్రము దీని । నేమరి యుండవలదు ధరణి । నెమ్మదిమకరిమాన్కి మది మొద్దుజేసి । కుంభించి పట్టవలెర ॥ ఊ ॥ ఇట్లుజయించినచో । నికజన్మించరుయెవ్వా । నెటజొచ్చిన నెల్లజగంబుల । జాటిచెప్పవినర ॥ ఊ ॥ బేతపూడికృష్ణు । బ్ర

(2) 

హ్మచలానందుడు । సతతసత్య శాంతాత్మమానవ్రత । వ్రాతోత్కృష్టుడుర ॥ ఊ ॥

(ఆత్మానుభవము)

14 జంఝూటిరాగము - ఏకతాళము - 'అరెపూలజానిలేలో' మాదిరి.

అహాలోలాత్మ నెడుపుగలాగవలెను । అందినవానిలోలయ మొంది నిల్వవలెను ॥ అ ॥ కుయ్యక దెలియక జెదరక గదలక । నీయందుజూచుచు లోకాంతిజేరుచు ॥ అ ॥ ఎల్లలోకములకెల్ల నిర్లోకనిధియౌచు । నిలవెలిలోపల నేకమై వెల్గుచు । లాలించి లాలనగనూచి జోకొట్టుచు । చాలించి చల్లగనిద్రబోనిచ్చుచు । నోలలాడించి బ్రహ్మాంబుధి దేల్చుచు ॥ అ ॥

(తీవ్రవైరాగ్యము)

15 నాథనామక్రియరాగము - ఏకతాళము - 'శంకరిత్రిపురసుందరి' మాదిరి.

చిత్తమా । చిచ్చుబెట్టుమా । జ్యోతిచేతని । జ్యోతులకెల్లను॥ చి ॥ భక్తి । నామముపల్కుము పై । జ్ఞప్తి । రూపముగాంచుము పై । శక్తి । సేవనుసల్పుము పై । నింతఅంతయొంతనియనరాని । యంతరాత్మపరమాత్మైక్యమగుము ॥ చి ॥ లేను। లయమాత్మకు ఆనల। లేదు। యెల్లెడలబొంచిన । లేను। లేలేదనులీలే । వస్తువంను నేకాకృతివెల్గుచు । నిత్తుమచలబ్రహ్మధ్వజమిప్పుడు ॥ చి ॥

(శోధనము)

16 ఖరహరప్రియరాగము - ఆదితాళము - 'ఆరెసయ్యా' మాదిరి.

ఔర యెందుగనెదనన్ను । నొహో యెందుగనరాక । జోరసర్ప



భీతిపెట్టెదా ॥ ఔ ॥ అరె యెన్నిగన్న నన్నిసున్న । బలెయేమికందు ముందు । మరె నోరాడదేమందు । మొఱగినను । పరికించినను । సరుగెత్తినను । దారువైతి ॥ ఔ ॥ అహ యేమిపరిపూర్ణమహిమ । నింతని తేల్చుటకల త్రినేత్రుకైనదరమె । యేనామరూపక్రియలులేక । నేయే కాలంబులందు । నేయేదేశంబులందు । బూస్ణుడవై యైక్యుడవై । శూన్యుడవై । తుర్యుడైతి ॥ ఔ ॥

(ప్రత్యక్షప్రభావము)

17 భేహాగురాగము - ఆదితాళము - 'ఆటలాడుదామా శ్రీ' మాదిరి.

నిండివెల్గుచుండుర । యుంను తేజంబింపుర । యెడతెగక నెప్పుడుజెడక । గొండఖండముగ నుండుర ॥ నిం ॥ మాయాతీతుడ నేనుర పేరెత్తచలావందుడర । అనుభవమతిత్రోవేడెడువానిని । యనయమునూలోనుంతుర ॥ నిం ॥ నామరూపములులేవుర । నానావిధములులేవుర ।

స్వప్రకాశమున శుద్ధసత్త్వునై । సంపూర్ణుండననొప్పుదుర ॥ నిం ॥ అను
భవజ్ఞానుల హృదయమురా । నాజ్యోతివెల్గునందుండుర । అణువున నణు
వై బ్రహ్మాండంబై । మణులప్రభావముదాల్చుర ॥ నిం ॥ బేతపూడి
శ్రీకృష్ణమురా । పృథివి నచలపరిపూర్ణమురా । అతీతబయలై శూన్యాం
తంబా । అత్యద్భుతైశ్వర్యమురా ॥ నిం ॥

(శూన్యము)

18 శుద్ధకాంభోజిరాగము - ఆదితాళము - 'ఇకనేమందునే' మాదిరి.

నాస్తి । నాస్తిశూన్యము। అస్తిఅనాస్తి । ఆస్తిస్థిరాస్తి ॥ నా ॥
శబ్దనిశ్శబ్ద । స్పర్శనిస్పర్శ । శక్తిఅశక్తి । శత్తిఆసక్తి ॥ నా ॥ జ్యోతిని
ర్జ్యోతి । జాతినిర్జాతి । నిత్యఅనిత్య । సత్యఅసత్య ॥ నా ॥ కండఅఖండ ।
కుండబ్రహ్మాండ । దండకోదండ । అండమహాండ ॥ నా ॥ తీతఅతీత ।
ధాతనిర్ణీత । అంతపరాత్మ । చింతనిశ్చింత ॥ నా ॥ కంటిముక్కంటి ।



గంటిమీటుంటి । నొంటినేనుంటి । తంటవద్దంటి ॥ నా ॥ చాలఅచల ।
జలనిశ్చల । శాలవిశాల । శూలత్రిశూల ॥ నా ॥ అందఆనంద । నింద
బెంపొంద । శుద్ధఅశుద్ధ । పందముకుంద ॥ నా ॥ పూర్ణసంపూర్ణ । వర్ణ
ఆవర్ణ । కన్నునేర్పూట । సున్నప్రసన్న ॥ నా ॥ నయనిర్ణయ । నేయ
నిర్భయ । వాయునిర్వాయు । పోయువాపోయు ॥ నా ॥

(పరిపక్వహృదయము)

19 ముఖారిరాగము - అటతాళము - 'రక్షరక్షఅసురశిక్ష' మాదిరి.

శాంతం నిత్యాత్మం । సత్యతేజం । సాధుసోహద్దృశ్యం ॥ శాం ॥
ఆదిఆకారం । ఊర్ధ్వముఖండం । హంతకాలమూర్తి । సతతప్రత్యక్షం ॥
శాం॥ నామరూపక్రియ । నాస్తిదేదీప్యం।సమ్మతిసహిత। మాపోజ్యోతిదీ
పం ॥ శాం ॥ కల్పితవృక్షం । నిల్పితేస్వప్నం । సల్పినశూన్యం । మా
పినశోకం ॥ శాం ॥ అనుభవతీతం। అంతర్యహంసం । ఆనందభోగం ।

ఆద్యప్రసాదం ॥ శాం ॥

(అప్రత్యక్షదర్శనము)

20 సురటరాగం. ఏకతాళం. 'తప్పకమిఱుంపుమయ్యా' మాదిరి

నిరామయం సుస్థిరం । నిరంతరం సూనృతం॥ ని॥ సారహీన ప్రాణి । నిరాపేక్షిసాక్షికం॥ ని॥ ఆదిమధ్యాంతరహిత । తనాదియాదికారిణి । యంత్యమనోవాక్కర్మ । నాస్తీతహంయని॥ ని॥ జేతపూడియుచలుడు । బ్రహ్మపూర్ణభావుడై । నాస్తితత్వశక్తిగా । నాస్తినోక్షముక్తిగ॥ ని॥

(అతీతము)

21 తోడిరాగము. అటతాళము. 'ఉదాయాహాం' మాదిరి.

మహాతీతము ముఖ్యామృతము । పెనగితెమధురము । పూర్ణిన అంతము॥ మ॥ అచంచలము। అనిర్వాచ్యము। అంచలఅంచము । నృత్య



గానము॥ మ॥ అంతరాత్మము । అంతఃకరణము । అంతఅందము । అత్యానందము॥ మ॥ అచలబ్రహ్మము । నిశ్చలచిత్తము । ఉంచతిశాంతము । ఎంచసాధ్యము॥ మ॥

(మాయ మూర్ఖము)

22 తోడిరాగము. ఏకతాళము. 'ఏలజలదవి' మాదిరి.

లేపదెన్నడు నొందలేరిల । లేశముపదేశంబున । లేనిపోనిబెదురుబోధచె । లోనగుందుచుందురు॥ లే॥ ఎంతవరకు నంతమువర । కంతమొందగోరరు । ఎంతోవింతగవింతవంతులై । వింతగాంచవాంఛింతురు॥ లే॥ భ్రమభ్రమరముల భ్రమకులోనైనసం । భ్రమమునభ్రమింతురు దు । ర్భ్రమలమత్తులై గతులగనక । నుస్మత్తయిభములై లేతురు॥ లే॥ స్థిరముగాశ్రీశూన్యబ్రహ్మ । తీతభావమెరుంగరు । జలధితత్వాసక్త శక్తితో । నలలరీతి నశింతురు॥ లే॥

(స్వభావము)

23 బారువరాగం. ఏకతాళం. 'తేరతేరెమేరె' మాదిరి.

అహాశూన్యమెసత్య । నాస్తి నాస్తి నిత్యశూన్యము । మిధ్యశబ్దస్ప ర్శసాధ్యసహితరహితశూన్యము॥ అ॥ జిహ్వానాదమెల్లజీరు । మననిదాన మెల్లజారు । తనతనువుపోరుతీరు । ప్రాణప్రతిమతీరుమారు । ఉన్న ప్రాణమెల్లజేరు । మిన్నుపయనమైపారు॥ అ॥

(మాహాత్మ్యము)

24 శహనరాగము. ఏకతాళము. 'ఔర యీసందేహ' మాదిరి.

ఔర జరామరణజాణ। ఓజగతిజిరాయుగలచాన॥ ఔ॥ అమ్మొ నీవెండమావువమ్మ । అమ్మనీయండనుండనమ్మ॥ ఔ॥ వహ్వాబూదిబూ సెపూర్ణ । భువినీభస్మభూతితోను॥ ఔ॥



(మననము)

25 నాధనామక్రియరాగం. ఆదితాళం. 'తెనుగురాకపోమె' మాదిరి.

ఓహోమాయమాయవునీవు । మహామాయంబవుచున్నావు॥ ఓ॥ మాయవర్ణమయమై । మాయావర్ణాలయములయమై । కాయగేయము లకిహమై యహమై॥ ఓ॥ త్రితీతాతీతులందు । శక్తిత్రిలోకత్రిమూర్తుల యందు । వేత్తమహాత్ములయందునెంచు॥ ఓ॥

(వ్యాపకశూన్యము)

26 జంఝూటిరాగం. ఏకతాళం. 'శ్రీరామచెందిరనె' మాదిరి.

నాయువంతటికెల్ల । వేల్పుయ్యొయుర్వినెల్ల । గూయుదత్వముల నెల్ల । గోయనుచు । అనతథ్యయగుచు । కనశూన్యమగుచు॥ వా॥ అ దెమెరుకనియన్న । నదెపరిపూర్ణమన్న । నదెపదేపదెయెన్నినన్న । నన్నివట్టినున్న॥ వా॥ కృష్ణానందాచల । పూర్ణబ్రహ్మమున । సోహారే

చక్రపూరకమందు। దేహమునందు॥ వా॥

(రహస్యము)

27 నాథనామక్రియరాగం. ఆదితాళం. 'హరియేపరిపూర్ణుడు' మాదిరి.

అహా సర్వశూన్య। ఐక్యకాచలసంపూర్ణ॥ అ॥ ఎన్ని దేశకాలశబ్దస్పర్శల। నెన్ని నామరూపక్రియలప్రాణుల। నెన్ని కర్మలోకబ్రహ్మజ్యోతుల। జనకనట్టె కనకనుండునట్టుల॥ అ॥ బేలిపూర్ణకృష్ణానందాచల। బ్రహ్మపూర్ణనందునిందు నెందున। నెంతమాత్రమాద్యంతము లేకను। ప్రాంతమంతమచల మొందునిట్టుల॥ అ॥

(ఉపదేశము)

28 అఠాణరాగం. ఏకతాళం 'ఏమందునీయందము' మాదిరి.

అతీతమాహాత్మ్యము। అవాచ్యామమదృశ్యము॥ అ॥ సర్వతుర్య సారము। ఊర్ధ్వహంసలకాసారము॥ అ॥ సిద్ధోదకస్నానము। తీతతత్త్వ



క్యసాధకము॥ అ॥ నిరతామృతపానము। తృప్తినొందునట్టి పానము॥ అ॥ అత్యద్భుతాద్భుతము। నిత్యమత్యంతఆనందము। అ॥ నిరామయ శూన్యము। నిర్గుణనిశ్శబ్దము॥ అ॥ పూర్ణబ్రహ్మచలము। పరిపూర్ణ పరమాత్మము॥ అ॥

(సారము)

29 భైరవిరాగం. త్రిపుటతాళం. 'దురభిమానమెంతచెప్పెది' మాదిరి.

శాశ్వతనుధ్వంసమయ్యెన। శాశ్వతమువిశ్వమయ్యె। సత్త్వజ్ఞానవైరాగ్యపూర్ణ। తత్త్వాతీతనాస్తియయ్యె॥ శా॥ దిక్కులేనితనువులయ్యె। దీప్తులెల్లగల్లలయ్యె। గోర్కెలెన్నిగలలయ్యె। స్రుక్కిస్రాక్కిసీల్లుటయ్యె॥ శా॥ బ్రహ్మచలపూర్ణమయ్యె। బరిపూర్ణఫలమయ్యె। నెమ్మిబక్వసఫలమయ్యె। నిమ్మహిప్రజ్వలించుటయ్యె॥ శా॥

(మాయోపాయపలాయనము)

30 ఫీలురాగము — ఏకతాళము — 'బాలులారమరువబోకుడి' మాదిరి.

మొదటికేమోసమ్మునూను । మొద్దై యుండుము । మోదమె
ల్లగుల్ల జేసి । యూదిపట్టుము ॥ మొ ॥ మృత్యురూపులెల్ల మది । ము
చ్చటింపకుము । మత్తుగనుమచ్చుజల్లై । యెత్తువేయుము ॥ మొ ॥
స్వజ్ఞానమనేస్వప్రకాశము । సంపాదింపుము । అజ్ఞానమనెజన్మజీవ ।
ప్రజ్ఞజూపుము ॥ మొ ॥ అచలబ్రహ్మానందునియలల । అత్యద్భుతము ।
జొచ్చిచల్లుచున్నదియుల్లమున । జేర్చినిలుపుము ॥ మొ ॥

(స్వజ్ఞానప్రచండశక్తి)

31 బారువరాగము — రూపకతాళము — 'కరినిగాచినసీత' మాదిరి

స్వానుభవముకుసాటిలేదిల। జాటిచూచిననెచటను ।యిహానుభ
వములసారముల । మైక్యంబుసున్నగజేసెను ॥స్వా॥ పరమహంసలకెల్ల



ను । పరమాత్మమైతాబరగెను । బీరంబులగుహంసములకెల్లను । వ
హ్నిమైహరియించెను ॥ స్వా ॥ అచలకృష్ణులచిత్తమే । యఖండ సా
క్ష్యమిచ్చెను । చాంచల్యమతులకచంచలంబుగ । గ్రుచ్చివక్కాణిం
చెను ॥ స్వా ॥

(ఏకాంతగతబాహ్యము)

32 జంఝూటిరాగము — ఏకతాళము— 'గరుడగమనరారా' మాదిరి.

ఒక్కఆవలింతలోనెగురునంత । ఒక్కతూరినరుగుమాయవింత ॥
ఒ ॥ ఇట్టిదీనినమ్మియుండుటెట్టు । మదిగట్టిజేసుకుగట్టుజేరుటెట్టు ॥ఒ॥
దరిదాపులేనిఝరియయ్యె । దారిదెల్పుదొరదారువయ్యె ॥ ఒ ॥ ఎట్టిత
త్వగతిపట్టెమనకు । భువినెట్టునొందకుండనికమనకు ॥ ఒ ॥ ఎరుకనెరు
కనెగరేసిమెరుగలేక । జోరసర్పముచేగరువబడుచుంద్రు ॥ ఒ ॥ నా
స్తాంతసాంతస్వాంతశాంతము । అచలపరిపూర్ణపూర్ణము సంపూ

ణాము ॥ ౭ ॥

(ఇష్టఫలసిద్ధి)

**33** మోహనరాగము-ఏకతాళము-'మాయలాడిమంగు బెట్టిర' **మాదిరి**

మోహవేశ్యప్రపంచమురా । **ముచ్చటాడిముచ్చుజూపుర** ॥**మో**॥ ముల్లోకతత్వములుర । తలచి నెతలక్రిందులుర ॥ **మో** ॥ అశాశ్వితాయువులుర । ఉశ్వాసనిశ్వాసలుర ॥ మో ॥ బ్రహ్మానందభాగ్యముర పరమైన శ్రీరామ్నముర ॥ **మో** ॥

(భేదాభేదబోధ)

**34** కమాచిరాగము - **ఆదితాళము** - 'మానసనామాట' మోస్తరు.

**మా**లబ్రాహ్మణమూలమిదివినర । కలికాలుడ । **మాయలో** బడి యేలఘూలెదుర । రక్తమాంసము లుయెముకలు । రోతయగా మలమూత్రపెంటలు । వాతశ్లేష్మపైత్యవ్యాధుల । వెతలపాలైమృత్యు

---



బొందు ॥ **మా** ॥ జాతినీతులజన్మచాలుర । జీవిజగతినుదో । న్మత్తగజమై మకరిజిక్కుర । తత్వజ్ఞానమొకించుకైన । చిత్తమందుదరచికనక రిత్తచపలపశువులవలె । యాతనబడిదాటిపోపు ॥ మా ॥ అచలపూర్ణభావమందర । అంతఃకరణ । వ్యసనములసన్యసించర ॥ ఎంచిశాంతశస్త్రముగాని । ద్రుంచి అహంకారమేను । పొంచి పంచముపంచజొచ్చి వంచిశంకల తర్కమాన్చు ॥ **మా** ॥

(సంహారము)

**35** బ్యాండుస్వరము - ఏకతాళము-'ఇంగ్లీషుపాట'మోస్తరు

లోకమ నాకడ్డురాకుము లెమ్మికరయమునదొలగుము । **లేకు**న్న దెగ వేతుఖడ్గము । నీకోర్కెలన్ని యేకము ॥ లో ॥ నీకుక్షికొల్లునేగొల్వను । నీకక్షలేమీక్షింపను । పక్షినై యంతశోధింతును । దీక్షనినునేసాధింతును ॥ లో ॥ **ఈమా**యతీతుజ్యోతిగెల్తువ । నీమాయలో

బడి మాయమహానువ । మర్మముడిగి కేలుమోద్దువ । నీమమతలో నేము
న్గియేద్దువ ॥ లో ॥

(మంగళము)

సౌరాష్ట్రరాగము - ఆదితాళము 'చందమామమాదిరి.'

నిఖిలమంగళం । నిర్మంగళ । మంగళ । నిష్కళకళ ॥ ని ॥ బ
హుహోయిని । యిహహంసో । అహమును । లయించుహర ॥ ని ॥
ఇదెస్థానముఆస్థానాతీత । సంస్థానాశూన్య ॥ని॥

---

(3)

# నీ తు లు

1 భ్రమలో భ్రమ భ్రమలో బ్రహ్మకు బ్రహ్మర్పణము
2 జీవమే జన్మము చర్మమే మర్మము
3 ద్విక్కులేని త్వక్కు దిక్కులేని దృక్కు
4 మాయమర్మము నిరామయము
5 అవిద్యనంటి మిథ్యమైనట్టు
6 పార్శ్వప్రాణికి ప్రపంచమేల
7 కలికూతలు కల్ల
8 శాంతశమంతకములోకచోట అతిశయ శేషులోకచోట
9 బ్రహ్మమెరిగిన బ్రహ్మకు బాహ్యమేల
10 అంతరంగమెరిగిన ఆత్మకువంతయేల

## 34

11 మాయలో మాయపాయలు

12 చెప్పెడుజీవి చేయనేరడు

13 అతిబోధ అతిబాధ

14 కర్మకర్మునకు కర్మమొందును నిష్కర్మునకు నిష్క్రమించును

15 నిరామయమయమే విరామము

16 స్వప్రయత్నము స్వలక్షణము యత్నము అల్పలక్షణము

17 లేప్రాయము నెంగనిమనము ప్రాయము నెంగునా

18 అతీతమహత్తు తీతతత్త్వాల కంతరిక్ష అచలము

19 బేలత్వమే బాల్యత్వము ధీరత్వమే యవ్వనత్వము కించత్వమే వృద్ధత్వము

20 మానమహిమవల్ల మదమనమునైన నడపవచ్చును

21 ఆయువుపోవును వాయువునిలుచును

## 35

22 నిరాపేక్షా పేక్షులఫలములు అప్రత్యక్ష ప్రత్యక్షములు

23 కలికాల్చునుగాని కాచదు

24 కలులు కలికల్లుగ్రోలి కూలవలసినదేగాని గెలువలేరు

25 కలికూలి

26 జీవము జగత్తయి యున్నది

27 మనుజుని మనుగడ మట్టిగడ్డ

28 ప్రయాసము సున్న ఫలితము లేదు

29 స్వశక్తుడు సర్వశక్తుడు పరశక్తుడు అశక్తుడు

30 చిత్తము త్రికాల త్రిలోక ద్రిమ్మరి

31 తత్త్వవిశ్వధ్వంసము శూన్యము

32 మాయ మాయనంటదు

33 మాయవాది మాయవిరోధి

34 ఇదిమన్ను అదిమిన్న
35 మాయఎరుక ప్రవేశము, ఎరుక మరుపు ప్రవేశము
36 అశ్వాండము
37 నాస్తికాకుంటే కాలమట్టైయుంటునా
38 మాయమాట మాయమాట
39 తత్వము దవ్వయితే జ్ఞత్వము దవ్వా!
40 ఎరుకలేదు మాయలేదు కాయము నామము కామయ
41 పరుకకు ఎరుకసాక్షి
42 మాయదాటి మాయమైనట్టు
43 మాయలేనివాడు మాయకు లేడు
44 పునర్జన్మ జన్మలపురిటిల్లు
45 జీవిజగమెరుగును ఆత్మ అంతమెరుగును



46 జన్మలేనిది జగములేదు
47 అహామునార్చి ఇహామునీడ్వవలెను
48 చేయగాచేయగా త్యాగము చావగా చావగా సౌఖ్యము
49 ఎరుకమైన నేర్చినకాని ఐక్యమివ్వదు
50 ఆవంత యావలేనివాడున్నాడా!
51 సర్వశూన్యుడు శూరుడు, శూన్యుడు సూర్యుడు
52 కొక్కెరలకుకోర్కెలు కరక్కాయలంత
53 మాయనుమాయ నెంచితే మాయ మాయముంచును
54 కలిరాణిఎట్లో కలిసేనలట్లు
55 తన కతిగినది తెన్ను, తనకతగనిదితన్ను
56 చచ్చినవాని సవరించవచ్చుగాని బ్రతికినవాని బాగుచేయలేము
57 లాగితేగాని తెరదీయదు వదిలితేగాని తెరవేయదు

76 జన్మలోనే జన్మబాధ

77 నిరుకు లేనినరుడు

78 మాయమొద్దు మాయకుముద్దు

79 ఎంతతత్త్వముకంత తెలివి

80 బోధకెక్కనిబుద్ధి బాధకెక్కునా

81 కఠినకంఠరవముల గట్టినట్లు

82 అమాయకునిపై మాయపెత్తనము

83 జీవివృత్తి ఆత్మనివృత్తి

84 జీవిజన్మము ఆత్మమయము నెవరికి జూపట్టను

85 బ్రతికిచచ్చుట ఎట్లని చచ్చిబ్రతుకుట ఎట్లని తలచితరచి పిచ్చియెత్తిచచ్చును

86 త్వరితము తీవ్రము బుట్టించును నెమ్మది నమ్మకము బుట్టించును



87 అన్నందువల్ల ఆనందములేదు కన్నందువల్ల అందములేదు

88 సొంతమంతమొందితే అంతకెవరు

89 సర్వాతీతుకు సప్తహార లవసరములేదు

90 గుత్తెఱుగనివాడే గురుడు గుత్తెఱిగినవాడే గురుపుత్రుడు

91 మోహమే మోహము మోహమే మేహము మేహమే ఏహ్యము

92 పాపె పాపము పాపమె తాపము తాపమె ధూపము ధూపమె దీపము దీపమె తపము తపమె పద్మము

93 నల్పుము నామము రాల్పుము రూపము కాల్పుము క్రియలను

94 జీవహృదయపీఠము వ్యసన మోహములకునికిపట్టయిమొప్పెడి దిక్కులేని స్మశానస్థానము. ఆత్మహృదయపీఠము నవరత్నఖచిత స్థాపితస్థానము

95 దృశ్యము లోహము, భ్రాంతి మూస, నిర్భ్రాంతి అగ్ని

లు కంబములు.

114 కనుట కూతలు, వినుట నీల్గుట, అనుట మనుట, ముక్తిక్రుంగుట.

115 నాస్తిసుస్వప్నము సకలవస్తుచయము, సమసిపోవుట, అనాస్తిదుస్వప్నము సర్వపదార్థసముదాయము సాక్షాత్కరించుట.

116 పెంకు పక్కమనును, రూపుమాయును, కర్మముపాపకర్మమాను

117 జన్మనాస్తి, దృష్టిదిష్టి, శ్వాసతుస్సు, శబ్దముమానము.

118 నైతినైతినేనైతి నేతినైతి నగ్ని చెంతజేర్చురీతి.

119 నాస్తినోరు ఊరుపేరు, నాస్తిరూపు చూపుసొంపు, నాస్తిసేన సేతసేవ, నాస్తిధ్వని నేనునీవు.

120 బ్రహ్మజ్ఞానికి కోలికలి లొంగకమానదు.

121 కర్తభోక్త, కర్మభర్త, క్రియహర్త.

122 నమ్మినదే నమ్మనిది, నమ్మునిదే నమ్మునది.



123 ఆత్మైక్యసిద్ధులు జ్ఞత్వాలు, జీవైక్యశుద్ధులు తత్వాలు.

124 భామలు పాములు, ప్రేమలు బాములు.

125 నిశ్చలమెభక్తి, చంచలమె శక్తి.

126 భక్తులు కుబేరులు, జ్ఞానులు జమిందారులు, వైరాగ్యులు రాజులు, పరిపూర్ణులు రారాజులు, అచలులు అంచలు, అతీతులు రాయంచలు, నాస్తికులు అంతరిక్షులు.

127 ప్రపంచజ్ఞానము పశుజ్ఞానము, మోక్షజ్ఞానము, మానవజ్ఞానము.

128 చింతె బ్రహ్మము, నిశ్చింతె ఆత్మము.

129 భ్రాంతి శశి, నిర్భ్రాంతి రవి.

130 కుక్షి చిచ్చు, మానము మైనము.

131 హాస్యపరిహాసము అమృతవిషము,

132 కొండ కండ, బెండు ఎండ.

